# 5.
# పట్టుగూళ్ల స్టైఫిలింగ్, కండీషనింగ్
## (Stifling and Conditioning of Cocoons)

జీవమున్న పట్టుకాయలలోని ప్యూపాలు కొద్ది రోజులలో (9 12 రోజులు) రూప వి్రకియ చెంది మాత్‌లుగా కాయలనుంచి వెలువడతాయి కాబ ఈ పట్టుకాయలను ఎక్కువ కాలం నిలవ చేయటానికి వీలుకాదు దీనివల్ల రీలరుకు అధిక న ^ కలుగుతోంది మాత్‌లు వెలువడిన పట్టుగూ _ రంధ్రాల గూళ్లు అంటారు ఇవి రీలిం కు పనికిరావు ఎందుకంటే వీటిలో దారం ఏక మంగా (Continuous) రాదు అన్నీ తెంపులుంటాయి అందుచేత రీలింగ్‌కు ఎంపిక ు న పట్టుకాయలను స్టైఫిలింగ్ (Stifling) చేయాలి

## స్టైఫిలింగ్ పద్ధతులు – అనుకూలనాలు – ప్రతికూలనాలు

ఒక క్రమ పద్ధతిలో పట్టుగూడు నాణ్యత చెడిపోకుండా లోపల ఉండే ప్యూపాను చంపటాన్ని స్టైఫిలింగ్ అంటారు

ఇందులో అనేక పద్ధతులున్నాయి ప్రాచుర్యం పొందిన స్టైఫిలింగ్ పద్ధతులను కింద వివరించడమైనది

### 1 ఎండబెట్టటం (Sun drying)

ఇందులో పట్టుగూళ్లను ఎక్కువకాలం ఎండకు ఆరబోసి అందులోని ప్యూపాను చంపాలి పట్టుకాయల సేకరణ తర్వాత కాయలను ఎండలో చాపలపై పల్చగా నెరపి ఆరబెట్టాలి ఈ విధంగా అనేక దినాలు, రోజంతా కాయలను ఎండబెట్టాలి ఎండ పెట్టిన గూళ్లను ఎన్ని రోజు లయినా నిలవ చేయవచ్చు ఎండిన గూళ్లు చాలా తేలికగా ఉండి గలగలమని శబ్దం చేస్తాయి

**అనుకూలనాలు**

1 ఇది చాలా సులువైన చవక పద్ధతి
2 కాయలు అన్నీ ఒకే రకంగా ఎండుతాయి
3 కాయల రంగు మారదు

**ప్రతికూలనాలు :**

1 ఆధునిక రీలింగుకు ఈ పద్ధతి స్టైఫిలింగ్ పనికిరాదు
2 ఎక్కువ రోజులు ఒకే క్రమంలో ఎండటం అన్నది బాగా ఎండకాసే దినాల్లో మా వీలవుతుంది
3 పట్టు దారం సున్నితమైనది ఎండకు దీని నాణ్యత పాడవుతుంది కాబట్టి రీల నాణ్యత తక్కువ ఉండే పట్టుదారం ఉత్పత్తి అవుతుంది వృధా పట్టు ఏర్పడుఁ
4 ఎక్కువ స్థలం ఎక్కువ కూలీలు కావాలి
5 పట్టుకాయలపై దుమ్ము – ధూళి పేరుకుంటుంది